

# కుమారశతకము



క. శ్రీమద్వేంకటగిరివర।
ధామంబుననిల్చిభక్తతతిఁబ్రోచెడునా।
సామజవరదుండెప్పుడు।
నీమృదుశతకంబుఁగరుణనేలుఁగుమారా॥ ౧.

క. కంజభవాదులచేనర।
పుంజముగొనిరాముఁగొలుచుపూనికగలయా।
యంజనకొడుకీశతకము.
రంజింపఁగఁజేయుఁగాతరాజకుమారా॥ ౨.

క. కవితనుఁగలిగించినయా।
కవిమొదలగుసంస్కృతాంధ్రకవులకుమ్రొక్కుల్।
సవినయముగఁజేయుచునీ।
కవిచెప్పఁగుమారశతకకవితఁగుమారా। 3.

కుమారశతకము.

చదివినపెద్దలుసభవా।
రిదితేలికతెలుఁగటంచునెంచఁగవలదీ।
చదివెడిపసిబిడ్డలకును।
జదువనిపెద్దలకుఁదెలియుసరళికుమారా॥ ౪.

తల్లికిఁదండ్రికిగురువున।
కెల్లప్పుడుదండమిడుచునేపనినైనన్।
మెల్లఁగవారలనడుగుము।
కల్లలుమాటాడమంచిగాదుకుమారా। ౫.

నిద్దురలేచియుమంచము।
నొద్దనెనిలుచుండివేడ్కనెన్నొదైవమునే।
ప్రొద్దంతసేయుపనులను।
వృద్ధిగఁబ్రోవుమనివేడుమీవుకుమారా॥ ౬.

ప్రొద్దుననిద్దురలేచియుఁ।
జద్దిఁదినివేగఁనీవుజమువులపంతుల్।
వద్దకుఁజనిఅఆలను।
దిద్దికొనుచునుండుమయ్యదినమ్ము ౭.

క. తెలతెలవారఁగ లేచియుఁ।
బలుదోమియుమురికిలేనిపంచలతోనీ।
పలకయుఁబలపముఁబుస్తక।
ములుజేకొనిబడికిఁజనుముముద్దుకుమారా॥ ౮.

క కచ్చికతోఁబలుదోమియు।
ముచ్చలుచొక్కాలుచలువమొలబట్టలుమేల్।
కుచ్చులకుళ్ళాయిడుకొని।
ముచ్చటగాబడికిఁబొమ్ముముద్దుకుమారా॥ ౯.

క పిల్లలుపిలచినతోడనె।
యల్లరిలేకుండలేచియతివేడుకతో।
జల్లగఁజనిబడిలోపలఁ।
బల్లపైనిఁగూరుచుంటబాగుకుమారా॥ ౧౦.

క. అబ్బాయీబడిలోనికి।
గొబ్బునఁబోకున్ననిన్నుఁగొందఱుపిల్లల్।
దబ్బునసీడ్చుకఁబోవుదు।
రబ్బబ్బాయనినవిడువరయ్యకుమారా॥ ౧౧.

బడిలోనికిఁబొమ్మనఁగను।
దడదడయనిదిగులుఁజెందితట్టలగాదెల్।
పడకటిగదులనుపిడకల।
గుడిసెలలోదాగకయ్యగోలకుమారా॥ ౧౨.

పప్పులుబెల్లముదెమ్మని।
తిప్పలఁబెట్టకుమునీకుఁదెచ్చినవియునీ।
యప్పయొసంగినవానినిఁ।
దప్పకదీసికొనిబడికితరలుకుమారా॥ ౧౩.

అమ్మనుబాల్పరుగులుతే।
తెమ్మనితంటాలుబెట్టఁ దేలేకనులే।
లెమ్మనికోపముసేయును।
అమ్మయిడినదానిఁగుడిచియరుగుకుమారా॥ ౧౪.

పాచిముఖంబునలేచియు।
గోచినిమొలఁబెట్టికొనకగుడుగుడుగుంజాల్।
పాచికలాడుచునుండినఁ।
జీచీయనితల్లిగొట్టుఁజిన్నికుమారా॥ ౧౫.

క. ఇతరుల యెంగిలియన్నముఁ
గతుకంగాఁ బోకు వారిగలరో గమునీ
కతుకును మూఁతికిఁ గావున
సతతముఁ బండైన జీకఁ జనదు కుమారా॥ ౧౬.

క. అన్నల దమ్ములతోనీ
వన్నము దినునపుడు వారినల్లరిగనునీ
వెన్నఁడుఁ బలుకకు పలికినఁ
దన్నులు దన్నుదురు తల్లిదండ్రి కుమారా॥ ౧౭.

క. కంచము గిన్నియుఁ జేవిది
లించక తిని వేగ మూఁతి లేచి గడుగుటల్
క్రొంచెము జదివియు మాపులు
మంచముపైఁ బండుకొనుట మంచి కుమారా॥ ౧౮.

క. ఏ బువ్వ బెట్టినను దిను
మా బువ్వే బెట్టుమనుచు నలుగకు కడసా
రే బువ్వ లేక యేకొర
డా బువ్వను బొట్టఁ బంతులయ్యె కుమారా॥ ౧౯.

క. కొట్టిన్న మైనఁగానీ।
గొట్టిలచల్లయినగానికోపపడకమీ।
కుట్టలతోజుటుజుట్టని।
జుట్టుకొనియు లేచిపొమ్ముసాగసుకుమారా॥ ౨౦

క, అంతనియింతనియింటను।
గంతులువేసినను మేలుగలుఁగదుబడిలోఁ।
బంతులుకోపముసేయును।
సంతోషముతోఁడబడికిసాగుకుమారా॥ ౨౧

క. చూచినవస్తువులనుఁదలి।
దాచినవస్తువులఁదెచ్చితనకిమ్మనినీ।
వాచకయుడుఁగకుబలుమరు।
నాచారముగాదునీకునరయఁగుమారా॥ ౨౨.

క. సొమ్ములుసొగసులుగోరకు।
కమ్మనిపచ్చళ్ళుఁగూరగాయలెపుడుతే।
తెమ్మనిమారముసేయక।
తమ్ములతోఁగూడిచదువఁదగునుకుమారా॥ ౨౩.

క. తలదువ్వికొనియుఁబువ్వులు
గలకొలఁదినిబెట్టికొనియుగాఁగునటికెలోఁ।
గలనీళ్ళుబోసికొనినీ।
చలువపరయిదొడిగిబడికిఁజనుముకుమారా॥ ౧౪

క. పుస్తకములుటోపియునీ।
వస్త్రంబులుమురికిసేయ వలవదెపుడునే।
మోస్తరునఁ జరుగనివ్వకు।
పస్తుగబడికెపుడుబోకు బాలకుమారా॥ ౧౫.

క. తెంపునఁదలిదండ్రులునిను।
బంపినబడితట్టుబోక బాజారులలోఁ।
గొంపలవెంబడిఁదిరిగిన।
జెంపలువాయింత్రువేగఁ జేరుకుమారా॥ ౧౬.

క. బలముగఁదినితిరిగిననిను।
పొలములువడిమన్నుదున్న పోతందువుగా।
తలవంచిచదివినను జన।
ములుగనిమొనగాఁడవండ్రు భువినికుమారా॥ ౧౭.

క. ఎక్కడనైననుగోడల।
బొక్కలలోవ్రేళ్ళుబెట్టఁ బోకుముబూచుల్।
జిక్కించుకొనియునిన్నుఁజు।
రుక్కనఁగఱవంగఁజూచు రూఢికుమారా॥ ౨౮.

క. బావులనుఁదొంగిచూడకు।
మావులదొడ్లోకిఁబోయి యాటాడకుమీ।
త్రోవనునెగురుచుఁబోవకు।
మావలమోసంబువచ్చు నయ్యకుమారా॥ ౨౯.

క. బొమ్మలుబోగమువాండ్రును।
దొమ్మరవాండ్రాడుచుండఁ దోవనుసావా।
సమ్మునకేపిల్లడువిను।
రమ్మనఁగనుబోయినిల్వ రాదుకుమారా॥ ౩౦.

క. పండ్లనిబాజారునవిని।
యిండ్లకుఁజనిడబ్బు గింజలిమ్మనిమారా।
ముండ్లనుజేసినఁదల్లియుఁ।
బండ్లనుబటపటనుగొఱికి బాదుకుమారా॥ ౩౧

క. ఎండలవానలలోపల।
కొండలవాగులకుఁ జెరువు కోనేళ్ళకుఁ బో।
కుండుము కాల్జారినను।
క్రుండయినను లేవదియ్యఁ గలఁడె కుమారా॥ ౩౨.

క. కుక్కలఁ గాకుల గ్రద్దల।
మక్కువతో ఱాలురువ్వ మార్గస్థులకుం।
దక్కునఁ దగిలినవారు పై।
టక్కునఁ గొట్టుదురు చెంపదప్ప కుమారా॥ ౩౩.

క. ఆట్లాడఁ బోయి పెద్దలు।
పోట్లాడఁగఁ జేయకయ్య బుద్ధిగలిగియే।
తిట్లాడక బాలురతోఁ।
గొట్లాడకఁ గూడియాడికొనుము కుమారా॥ ౩౪.

క. పండుగదినములలోపల।
దండిగ భుజియించి తల్లిదండ్రులతోనే।
యుండుము వీధులలోపల।
పుండాకోరులను గూడఁ బోకు కుమారా॥ ౩౫.

క. పెద్దలుబిలచినవారల।
వద్దకుఁజనినిలువఁబడియు వారలనోళ్ళన్।
బుద్ధులమాటలువినిపెర।
సుద్దులకనుబోకఁజనుపుసుమ్ముకుమారా॥ ౩౬.

క. చదువనఁగ వ్రాఁతఁజేయుట।
చదువా యదిగొల్లవానిచదువేకాదా।
చదివినదర్థముసెప్పెడి।
చదువేచదువయ్యబాగఁ జదువుకుమారా॥ ౩౭.

క. చక్కఁగఁజదువఁగనేరక।
కొక్కెరమాటలను నేర్చికొన్న జనంబుల్।
కుక్కనుచీకొట్టినగతి।
నెక్కడికినిఁజేరనియ్య రెవరుకుమారా॥ ౩౮.

క. పాటలుబాడఁగనేర్చినఁ।
గోటివరాల్కుప్పలైనఁ గోరునినుమేల్।
పాటలుబాడుమటందురు।
కోటలతోరాజులైనఁగోరికుమారా॥ ౩౯.

క. ఇతరులకుఁ జదువు బాగుగ।
నతికినదనిదిగులుపడక యభిమానముతో।
సతతమువిడువక చదివిన।
నతిశయముగఁజదువునీకు నబ్బుకుమారా॥ ౪౦.

క. ఎక్కువ వెరసులు కానులు।
తక్కువ సమానములు చదువఁదలవనిచోనే।
లెక్కయినరాదుగావున।
ముక్కుముగానేర్చికొనుము ముందుకుమారా॥ ౪౧.

క. చదివినదిమరచిపోకుము।
చదువఁగవలసినది బాగ చదువుకొనుముతేఁ।
పదమాపిదిచది వెదనని।
మదమునఁదిరుగకుము తేఁపుమాపుఁగుమారా॥ ౪౨.

క. ఇతరులనుజూచిలెక్కలు।
సతతము వేయుటయు వ్రాయఁజనఁగూడదురా।
మతిహీనమానుతుదినీ।
గతియంతే తెలివిరాదుగదరకుమారా॥ ౪౩.

క. ఒజ్జలు సెప్పిననీతులు।
బొజ్జనిడికొనుము మరువఁబోకుము బడిలో।
గుజ్జగుతాటాకులునీ।
గజ్జెలగంటమున వ్రాయఁ గనుముకుమారా॥ ౪౪.

క. కాపీబుక్కులు చక్కఁగ।
నీపేన్సలు రూళ్ళు వేసి నీటుగ దస్తూ।
రీపాటిలోపముంచక।
రాపాడఁగ వ్రాయవలయురా సుకుమారా॥ ౪౫.

క. బడియుంచుఁ జనువునప్పుడు।
గుడగుడయని మాటలాడఁ గూడదు పాఠాల్।
తడబడకఁ జదువవలయును।
విడువఁదురా లేఁదటన్న వినుముకుమారా॥ ౪౬.

క. పాటము పద్యము చదివిన।
ధాటిగఁ జదువంగవలయు ధైర్యముతోనే।
మాటడిగినఁ జెప్పిననీ।
సాటి యెవరు లేరటం్రడు సభను గుమారా॥ ౪౭.

క. నీపుస్తకమునుబలకయు।
మాపులుమధ్యాహ్నమయిన మరువకుబడిలో।
నేపిల్లవాఁడుజూచిన।
రూపయినను జూపఁడయ్య రూఢికుమారా॥ ౪౮.

క. పంతులులేనప్పుడుర।
వ్వంతయునల్లరినిఁ జేయవలవనువారా।
చెంతలఁగనుగొనినీచే।
యంతయుఁబగులంగఁజేతురయ్యకుమారా॥ ౪౯.

క. కసరెనుపంతులటంచును।
మసెలపయినిదాగిబడికిమసలినఁదల్లే।
పసివాఁడవనుచుఁజూడదు।
కసపిసనలుపుజుమిచెవులుకందఁగుమారా॥ ౫౦

క. ఒంటికిరెంటికిననిజని।
కొంటెలతోఁగూడియాడుకొనఁబోకుమురా।
తంటాలుబెట్టిపంతులు।
గంటయిననునిలువఁబెట్టుగదరకుమారా॥ ౫౧.

పప్పులుపండ్లుమితాయిలు।
నప్పచ్చులుదినుచుబడికినరుగకుపిల్లల్।
చప్పట్లుఁగొట్టియడుగును।
రప్పటిలోనెజ్జకొట్టునయ్యకుమారా॥ ౫౨.

గడబిడయనిబాజారున।
వడివడిగానెవ్వరయినవాగుచునుండన్।
బడియుంనుఁబలకదస్త్రము।
విడిచియుఁబరుగెత్తఁబోకువేగకుమారా॥ ౫౩.

జుట్టువిరబోసికొనిమసి।
బట్టలుగట్టుకొనిపిచ్చివానిగనెసలే।
బొట్టునులేకుండినను।
పట్టపగటివయ్యమండ్రుపరులుకుమారా॥ ౫౪.

మాపులుదీపముబెట్టియు।
నోపికతోఁజపముకొనుచునొకనాడయినన్।
నీపనిమానువకచేసిన।
లోపమురావయ్యచదువులోనఁగుమారా॥ ౫౫.

క. నీటుగదీపము మాపటి।
పూటను బెట్టుకొని చదువు పుస్తకమును నా।
వ్వాటల పాటల మాటల।
గోటుగ గడుపంగఁ బోకు కూర్మి కుమారా॥ ౫౬.

క. అవ్వలు దీపము బెట్టియుఁ।
గవ్వముతోఁ జల్లఁ జేయు కాలమునందే।
చివ్వన లేచియు పాఠము।
మవ్వముగ నుఁ జదువు చుంట మంచి కుమారా॥ ౫౭.

క. పిల్లలు చదువుటఁ గని వెడ।
గొల్లని వలె నిల్వఁ బడకు కోతుల వలెనే।
చిల్లర పనులను జేయకు।
మల్లరి పాలగుచుఁ బోడువవు డెకు [illegible] రా॥ ౫౮.

క. సంతోషముతో నాడఁగ।
బంతులు సెలవియ్యఁగా నెపదు గురతోఁడఁ।
బంతుల గోలీల్కప్పల।
గంతులు జరిపట్టిలాడఁగదలు కుమారా॥ ౫౯.

క. ఏపనికి ననుబంపిన।
నాపనిఁబోగొట్టియాటలాడుచునున్నం।
బాపడవని పెద్దలుదయ।
జూపకకొట్టెదరునిన్ను జూచికుమారా॥ ౬౦.

క. ఆటలనుమరిగిబడికొక।
పూటయినను బోక పలకపుస్తకములుమీ।
గాటనఁబెట్టియు వేళకు।
గూటికినిలుజేరఁదల్లిగొట్టుఁకుమారా॥ ౬౧.

క. నిత్తెముబడికరుగకతలి।
ముత్తవ్వలజెప్పుమనుచుముందంపినచే।
యుత్తరముఁజూపమాస్టరు।
బెత్తముచేఁగొట్టునయ్యపిన్నకుమారా॥ ౬౨.

క. ఉడికియునుడకనియన్నము।
కడుపునఁదినఁబోకు నొప్పిగలుగునురుచిగా।
నుడికినయన్నముగూరలు।
గుడుచుటనారోగ్యంబుమంచిగుణముకుమారా॥ ౬౩.

క. పచ్చివిపుచ్చువిపక్షులు।
గిచ్చినకాయలనుదినుటగిట్టవుపెద్దల్।
మచ్చికతోనిచ్చినవే।
పుచ్చికొనియుఁదినుటమంచిబుద్ధికుమారా॥ ౬౪.

క. పప్పన్నమునకుఁబోయిన।
నప్పచ్చులునేయిపెరుగునాకులుపక్కల్।
చెప్పించియునీకన్నియు।
నిప్పించుమటంచువాగకెపుడుకుమారా॥ ౬౫.

క. చలికాలమునీయింటను।
గలబట్టలఁగప్పికొనుముకాసేపయినన్।
మొలబట్టతోడఁదిరుగకు।
చలిపుట్టునుజలుబుసేయసాగుకుమారా॥ ౬౬

క. చలిమంటలనుచువీధిని।
గలపుల్లలుదెచ్చినిప్పుకలుపెట్టినన్।
చలిమంటబట్టలంటిన।
గిలిమంటైపుండులౌనుగీడుకుమారా॥ ౬౭

వడగండ్లుదినకు వానల
వడివడిగను బరుగులిడకు వలదనుపండుల్
పిడువక తినఁబోకుమురా
గడగడచలిజన్ని నీకుఁగలుఁగుకుమారా॥ ౬౮.

౯. దడదడయురుముల మెఱుపుల
చెడువానలుగురియఁబాడవు చెట్టుల మేడల్
గుడిగోపురములనిల్వకు
పిడుగులువడుపాడవుచోట్లపిచ్చికుమా॥ ౬౯

౦. పెద్దలువలదనిచెప్పిన
రెద్దయినను జేయబోకు మెఱిఁగిననినుగం
పెద్దనిబుద్ధనిపిలుతురు
బుద్ధిగలిగిమంచిపనికిఁబొమ్ముకుమారా॥ ౭౦.

౧. అయ్యలువలదనిచెప్పిన
గొయ్యలుఁ వేలాడుచెట్టుకొమ్మలతోనే
యుయ్యాలలూఁగఁబోకుము
చెయ్యికాలోవిరుంగ జేయుకుమారా॥ ౭౧.

క. కొడవలిగొడ్డలికత్తెర।
పిడికత్తియుచాకుకత్తి పీటలతో మా
మిడిపండులైనఁగోయుఁగ
గడఁగకుచెయి కాలు తెగునుగానకుమారా॥ ౨౨

క. పొరుగింటిపిల్లవారలు।
పరమాన్నముగారెబూరెపండ్లేవయినన్।
వెరిమనుదినుచుండుటఁగని।
బిరబిరనీవడుగకయ్యపిన్నకుమారా॥ ౨౩.

క. పిల్లలమెల్లఁగరమ్మని।
గిల్లియుజగడాలు దేకుగీపెట్టుచునా।
పిల్లలుదల్లికిఁ జెప్పిన।
నల్లరిగనుదిట్టిగొట్టునామెకుమారా॥ ౨౪.

క. రోగులఁబిచ్చిబికారుల।
జోగులజంగములపిల్లజట్టులవారిన్।
మూఁగలముక్కిడివారిని।
నాగడపుంబల్కుఁబల్కకయ్యకుమారా॥ ౨౫.

క. గుడ్డినిఁజెవిటినిమూఁగిని।
బుడ్డలుగలవారిఁబెద్దబొజ్జలవారిన్।
దొడ్డిగకాల్గలవారిని।
నొడ్డెలనెగతాళిసేయకుండుకుమారా॥ ౭౬.

క. అసెవసెయనియాడంగుల।
పసితనమునఁబిలువఁబోకుపరువుదొలఁగురా।
పసివాఁడవనుచుఁజూడరు।
కసరచుఁగొట్టెదురుచెంపకాయకుమారా॥ ౭౭.

క. రారాపోరాయనిపెర।
వారలఁబిలువంగఁబోకువారలునిన్నా।
తీరునఁబిలచిననీకే।
తీరునమర్యాదదక్కుధీరకుమారా॥ ౭౮.

క. గచ్చుటరుంగులనిలచియు।
వచ్చుచుఁబోవుచునుదిరుగువారలనెపుడున్।
బిచ్చిగమాట్లాడకురా।
వచ్చునుగోపంబుమాటవచ్చుఁగుమారా॥ ౭౯.

క. కాలికిఁజెప్పులుదొడుఁగక।
కాలవకునుబోకుమచటఁగలముండులునీ।
కాలినివిరుగునుజీఁకటి।
కాలములోఁదేలుపాముగరచుకుమారా॥ ౮౦.

క. పెంటలుపేడలుదొక్కిన।
వెంటనెకాల్లడిగికొనకవేసరిననునీ।
జంటకుమారులుటిల్లా।
లంటనినిన్నంటనియ్యరయ్యకుమారా॥ ౮౧.

క. బట్టలుపొడుచునుగాడ్దెలు।
గుఱ్ఱంబులుఁతన్నుబొరుగుకుక్కలుగరచుఁ।
గొఱ్ఱెలుఁబుఱ్ఱనిచీదును।
వెఱ్ఱిగఁజనబోకువానివెంటకుమారా॥ ౮౨.

గొడ్లనుగాయఁగజనిమే।
గొడ్లనునీవెక్కిదవుడుగొట్టకుమవివా।
గొడ్లెక్కినముకుడొంకల।
రొడ్లనుజనునపుడుచెట్లరుద్దుకుమారా॥ ౮౩.

క. కోళ్ళనులేళ్ళనుగట్టిపా।
పేళ్ళనుపందెంబువేయుటెఱిగియునీవా।
వేళకుఁజూడఁగఁబోకుము।
కాళ్ళనుద్రొక్కుడుసందుగాకకుమారా॥ ౧౪.

క. చుట్టములఁజూచు నేడుక।
బుట్టినబడిసెలవు నీకుబుట్టిననాఁడే।
తట్టునఁజనివారలఁగని।
గుట్టుగరమ్మయ్యౌజమవుకొనఁగకుమారా॥ ౧౫.

క. జలదారిముఱుగుపెంటలు।
గలతావులనిలువబోకుగబ్బుగలుగురా।
తలనొప్పిగలిగియట్టపై।
బలుపలురోగములుపుట్టుబాలకుమారా॥ ౧౬.

క. నిమ్మలజామలదబ్బల।
కమ్మనిమామిళ్ళపనసఖర్జూరముదా।
నిమ్మలనీడలనిలువుము।
తుమ్మలదరినిల్వకెపుడుత్రొలఁగుకుమారా॥ ౧౭.

క. నెలకొకనాఁడై ననునీ!
తలకాయనునూనెచేతఁదట్టించుమురా!
కలలెపుడురావునిద్దుర!
గలుగునుజదువుటకుఁదెలివిగలుగుకుమారా ॥౮౮.

క. పొగచుట్టలుబీడీలును
సిగరెట్టులుత్రాగఁబోకుజిన్నప్పుడెయా!
పొగచేతనురొమ్మెండును!
సొగసగునీపెదవినలుపుసోకుకుమారా॥ ౮౯.

క. ముక్కుపొడిబీల్చుచుండినఁ!
జొక్కాయలుమరకలగునుసోలలవలెనీ,
ముక్కులచక్కనఁజెడుఁదల!
కెక్కునుగొంతుకకుఁజేరునెపుడుకుమారా॥ ౯౦.

క. చుట్టలుమీటుచుబాజా!
ర్నట్టనడుమనిలచినిలచినవ్వుచుటోపీల్!
బెట్టియుబుక్కులుబట్టియుఁ,
బొట్టలుమువ్వచునుఁదిరుగబోకుకుమారా॥ ౯౧.

క. చీట్లాటనేర్చికొనకుము।
పోట్లాటలువచ్చుజనువుపోవునుబాడై।
తిట్లాటలేనిచనవుల।
పోట్లాటలునేర్చికొనగపొమ్ముకుమారా॥ ౯౨.

క. బడిలోనిబలపమైనను।
గుడిలోపలితులసితోటకూరాకైనన్।
దడికందిపుల్లలైనను।
తడబడకనుదొంగిలించఁదగదుకుమారా॥ ౯౩.

క. దాణావేయుటకొంచకుము।
కాణంబులఁజూచిదోసకాయలనైనన్।
బూనికదొంగిలబోకుము।
ఠాణాలోదెబ్బలయ్యెడజనుకుమారా॥ ౯౪.

క. తోటలనుదొడ్లలోపల।
వాటంబగుపండ్లఁజూచివహ్వారెయనిమే।
చోటనకకొయ్యఁబోకుము।
మాటనినినుగొట్టుఁదోటమాలికుమారా॥ ౯౫.

క. ఎరిఁగినదెరుఁగనటంచును।
నెరుఁగని దేనెరుఁగుమనని యెంగిలిమాటల్।
వెరువకఁ బలుకకుఁ బలికిన।
నరనిముసము నిలువనియ్యరయ్యకుమారా॥ ౯౬.

క. అదలించిన బెదరించిన।
పదపదయని నిన్ను క్రిందఁబడఁద్రోసిననీ।
వదరక బెదరక నిజమును।
వదలకు రానీకు మేలు వచ్చుఁ గుమారా॥ ౯౭.

క. ఉప్పని చప్పని మాటలఁ।
జెప్పినవి నివారు నీకుఁ జెప్పినరీతిం।
జెప్పకు మెప్పుడ బద్ధము।
పప్పులు దినకుండ రాలు పండ్లు కుమారా॥ ౯౮.

క. నవ్వులకైనన బద్ధం।
బవ్వలతోనైన నెప్పుడాడకు గీడౌ।
నివ్వసుధలోనతంగెడు।
పువ్వయి ననుదొంగిలంగఁ బోకు కుమారా॥ ౯౯

క. ఏతప్పుపనులు సేసిన।
తాతప్పులునయ్యవార్లుతగుపెద్దలుని।
న్నాతప్పులడుగదాచక।
నీతప్పుల నొప్పికొనుటనీతికుమారా॥ ౧౦౦.

క. మస్తుగఁజదివిసనీకుసి।
రస్తాపనివచ్చుడబ్బురాజేయునురా।
దుస్తుకుమాలలువెసియు।
ముస్తీబుగఁదిగుగవచ్చుముంపుకుమారా। ౧౦౧.

క. గట్టిగజదివియుసర్టిఫి।
కెట్టునుదేకున్న నిన్ను కేర్లెస్సనుచుఁ।
వెట్టిపనియైననియ్యరు।
పొట్టకుఁగూడైనజిక్కఁబోదుకుమారా॥ ౧౦౨.

క. వారములోపలఁబ్రతిశని।
వారమునాఁడైనమొక్కవాఁడవెలోకా।
ధారునిసంగీతంబులు।
కోరికతోఁబాడుచుండుగురిగకుమారా॥ ౧౦౩.

క. దేవుని భజనలు చేసెడి।
తావులకును బోయి పిల్ల తంత్రంబులలో।
నీవును జేరక స్వామికి।
గావలసిన పాటపాడి కదలు కుమారా॥ ౧౦౪.

క. మాపులు మంచం బెక్కియు।
నోపికతో నొక్కసారి యోసర్వేశా।
యీపగలు నేను జేసిన।
పాపములను క్షమింపు మంచు పందు కుమారా॥ ౧౦౫.

క. చిల్కా వేంకటకృష్ణుఁడు।
బల్కిన యీ బాలనీతిపద్యము లెల్లన్।
గుల్కుచు జదివియు ముద్దుల।
చిల్కలకును నేర్పవచ్చు జిన్ని కుమారా॥ ౧౦౬.

క. కుండిన సీమను కరణపు।
పిండులలో మేటియనఁగఁ బేర్వడసిన పా।
ఘండగు బాల్లయ్యామా।
త్యుండీకవి వరుని జనకుఁడోయి కుమారా॥ ౧౦౭.

క. ధరహారికరుణాపిరంగీ|
పురినిఁగుమారాఖ్యశతకమునుగ్రీస్తుశకం|
ఇరువదవశతాదినిశా|
ర్వరినామకవత్సరమునవ్రాసెఁగుమారా॥- ౧౦౫.

సంపూర్ణము.



